# గోలకొండ పత్రిక

చిత్రభాను సం।।ర చైత్ర బ।। ౫ సోమవారము


## క్రిప్సు రాయబారము

బ్రిటిషు ప్రభుత్వపక్షమున సర్ స్టాఫర్డ్ క్రిప్సుగారు భావిభారత రాజ్యాంగస్వరూపమును నిర్ణయించు షరతులను తీసుకొనివచ్చుటయు వివిధ భారతీయ నాయకులతో సంప్రతించుటయు తాము తెచ్చిన సూచనలను ప్రకటించుటయు, వివిధపత్రికలు నాయకులు తమ అభిప్రాయములను ప్రకటించుటయు పాఠకులకు తెలిసియున్నాము- అందరొక యెత్తు భీమ.డొక యెత్తు. భారతీయ రాజకీయవర్గాలన్నియు ఒక యెత్తు కాంగ్రెసుఒక యెత్తు' కాంగ్రెసు ఏమంటుంది అన్న విషయము భారత దేశమందే కాదు సర్వప్రపంచమందును చాలా ఆతురతో నిరీక్షింపబడుచున్నది. ఇంతవరకు విన్నవార్తలనుబట్టి కాంగ్రెసువారు దేశరక్షణను భారతీయులవశ మివ్వజేచేయనందున నిరాకరించినట్లు క్రిప్సుగారికి ముందుగా ఆంతరంగికముగా తెలిపిరని కూ దానిపైగూడా ఏదోవిధముగా సమాధానపడే వాలకం కనబడుతుందని కూ తెలియుచున్నది. ముస్లింలీగువారు కాంగ్రెసువారి నిర్ణయంకొరకు కాపెట్టుకొనియున్నారట! హిందూమహాసభయు సిక్కుసంఘమువారును పాకిస్థాను లక్షణాలే క్రిప్సుగారి రాయబారములో ఉన్నవని ఈభావిరాజ్యాంగాన్ని నిరాకరించినామని స్పష్టముచేసినారు. చాలాపత్రికలు క్రిప్సుసూచనలకు ప్రతికూలంగా వ్రాసినవి. మితవాదనాయకులును కొన్ని మార్పులైతేనే బాగుంటుందని సూచించినారు- ఇదియింతవరకు మనకు వ్యక్తమైన దేశీయాభిప్రాయము.

దీనిపై మాకు తోచినకొన్ని విషయాలను వెల్లడించుచున్నాము. క్రిప్సుగారు తెచ్చిన బ్రిటిషుపార్లమెంటులోని యుద్ధమంత్రికూటమువారి పంయుక్త నిర్ణయము పూర్వపు అగస్టు ౮వ తేది నాటి ప్రకటనకన్న ఎక్కువగా ప్రసాదించునదై యున్నదనుటలో సందేహము లేదు. కాంగ్రెసువారు స్వరాజ్యమును మరియు సంపూర్ణస్వాతంత్ర్యమును కోరుచుండిరి. క్రిప్సుసూచనలలో డొమినియను హక్కును ఇస్తూ భావికాలములో ఇండియాకు ఆంగ్లస్థానసహవాసము సరిపడనియెడల వేరైపోయ్యే అధికారమున్నూ ఇచ్చినారు. అయితే దానికిని స్వరాజ్యమునకును భేదములేకుండిన డొమినియను స్థానము అనటకమారుగా స్వరాజ్యము అనిచెప్పరాదా అని యెవరో క్రిప్సుగారిని నిలదీసిఅడుగగా అంతా ఒకటే, మాటభేదమేకాని అర్థభేదములేదని వారు స్పష్టపరచినారు. కాంగ్రెసువారు ఇంకొక విషయం కోరియుండిరి. భావిరాజ్యాంగ విధానమును మేమే నిర్ణయించుకొందుమనియు, పార్లమెంటుకందు దఖలుండకూడదనియు కాంగ్రెసు వారు కోరియుండిరి. అదేవిధంగా నేచేసుకొనుడని ఇప్పుడు బ్రిటిషు వారు తెలిపినారు. బ్రిటిషు వారికి ఇండియా అంటే ప్రధానంగా వ్యాపార లాభాలకుగాను ప్రత్యేకించుకొన్నట్టి విశాలదేశమని చాలామంది అభిప్రాయపడియుండిరి. అందుచేత బ్రిటిషువ్యాపారానికి మంచిసంరక్షణ బ్రిటిషువారు యేర్పాటుచేసుకొనియే తీసురని కొందరుభావించిరి. కాని యిప్పుడు క్రిప్సుగారు బ్రిటిషు వ్యాపారానికేమిన్ని సంరక్షణలు ప్రత్యేకతలు కోరరని చెప్పినారు ఇదినిజముగా బ్రిటిషు వారుచేసిన గొప్పత్యాగము, దీనికై వారి నెంత అభినందించినను లోపములేదు.

ఇదివరలో ఎన్నిమారులు బ్రిటిషువారు ఎన్నిమాటలుచెప్పినను మీకు డొమినియన్ స్థానమిస్తామన్నారు. వెస్టుమినిస్టరు శాసనబద్ధమగు డొమినియను స్థానముకే ఇస్తామన్నారు. అంతాబాగుందిగాని యెప్పుడిస్తారయ్యా అంటే యుద్ధమైనతర్వాత అనిఅన్నారు. యుద్ధముతర్వాతఅంటే "కాలోహ్యయంనిరవధిః" అన్నట్లుగా దానికొక పరిమితిలేకపోయెనేమయ్యా యుద్ధానంతరం ఏడాదికా రెండేండ్లకా ఐదేండ్లకా ఏదోఒకగట్టిమాటచెప్పండిఅని మరీకొందరపెట్టి విచారించగా విచారించగా ఎంతతొందరగాపీలైతే అంతతొందరగాయిస్తాములే అని అస్పష్టముగా చెప్పుతూవచ్చిరి. ఇప్పుడు క్రిప్సుగారి సూచనలో యుద్ధం ముగిసినతోడనే స్వరాజ్యమిస్తామన్నారు అదికూడా కొంకిపంగ్యముగానే ఉన్నదని కొందరునాయకులు ఈయనతో అన్నారు. యుద్ధంవిరామము అయినతర్వాత శత్రుదేశాలను వశపరచుకొనుట శత్రువులను నిరాయుధులుగాచేయుట, వారినుండి నష్టపరిహారము తీసుకొనే లెక్కలమదింపులుచేయుట, సంధిషరతుల బేరాలను సాగదీయుట ఈకార్యాలావమంతా ముగిసేవరకు రెండేండ్లైనా పట్టును కావున యుద్ధముముగిసినతర్వాత రెండు మూడేండ్లు కాచుకొని ఉంటే అంతఓపిక మాకుండదని కొందరునాయకులు చెప్పినట్లున్నది. అందుచేత "యుద్ధ విరామము" (cessation of hostilities) అయినవెంటనే మీకు స్వరాజ్యమిస్తామని క్రిప్సుగారు చెప్పినారు. ఇదికూడా మంచివార్తయే.

ఇంతవరకు అంతాబాగుంది. ఇక ఇందలిలోపాలను గమనింతము. మొట్టమొదటిలోపమేమనగా హిందూస్థానానికిచ్చే స్వాతంత్ర్యమంతయు యుద్ధానంతరమే. ఇప్పుడేమిన్నీ లేదు. ఇదివాయిదా హుండీ (Post dated cheque) అని గాంధీగారు చమత్కారముగా అన్నారు. అయితేదానికి సరియగు కారణమును క్రిప్సుగారు సూపినారు- ఏమనగా ప్రాణాంతకమైన యీ యుద్ధకాలములో జపానువారు సరిహద్దుపై విజృంభించుచు ఒత్తుకొనివచ్చేకాలములో స్వరాజ్యమున కవసరమగు ఎన్నికలు, మున్నగు చిక్కులన్నియు లాభకారియగుటకు మారుగా నష్టకారియగును. ఇప్పుడు భారతదేశమంతా మహోద్రేకముతో ఇదినాదేశము, నాకుస్వాతంత్ర్యమున్నది నాస్వాతంత్ర్యాన్ని నేను ప్రాణాలిచ్చి కాపాడుకొని తీరుదును అనుగాఢమగు శక్తితో శత్రువులను ప్రతిఘటించవలసిన సమయముకదా. ఇది సమంజసముగా ఉన్నది. కాని భారతీయులకు కేంద్రప్రభుత్వ మంత్రివర్గములో స్థానాలిచ్చి అట్టి వర్గము శాసనసభకు బాధ్యతవహించి నడగా చేయవచ్చునుకదా.

రెండవలోపమేమనగా క్రిప్సుగారి సూచనలలో ఇకముందు హిందుస్థానములోని వివిధరాష్ట్రాలు ఒక ఇండియన్ యూనియనుగా ఏర్పడును కాని అట్టియూనియను (సమిష్టిసంఘము) లో చేరుటకు ఇష్టములేని రాష్ట్రాలువేరుగా ఉండవచ్చును అట్లనుటలో ముస్లింలీగు వారు కోరేపాకిస్థానును మీరు వారికి ప్రసాదించినారన్న మాటయేకదా అని యొకరు క్రిప్సుగారిని విచారించగా "ఏమాత్రము అట్లుకాదు" (certainly not) అనిగట్టిగానే ఊదిపలికినారు. కాని క్రియలో అదేపరిణామము కనబడుచున్నది. పైగా ముస్లింలీగువారికిని హిందూమహాసభవారికిని సిక్కుమహాసభవారికిని ఏకవిధముగా పాకిస్థాను అనే అర్థము కలిగినది. కన్నిసంఘాలకు ఈభావన యెట్లుకలిగెను! అయితే ఒకమాట. గాంధిగారే ఇదివరలో ఈవిషయాన్ని గురించి యీ క్రిందివిధముగా అర్థమువచ్చు మాటలు వ్రాసియుండిరి "నేనుహిందూస్థానవిభజనను సహించను అయినాభావికాలములో ముస్లిములు వేరైపోతామని కోరితే వారిని ఏశక్తికూడా అడ్డుపెట్టజాలదు" ఒక వేళముస్లిములు అధికసంఖ్యాకులుగా హిందుస్థానినుండి వేరైపోతామని హఠముచేస్తే హిందువులు వారిని వద్దనివారితో ద్వంద్వయుద్ధముచేయవలసినదేనా? ఇష్టములేని కుటుంబభాగస్థులు వేరుపడుటకు అధికారముగలదు. కావున ముస్లింలీగువారి కోరికననుసరించి సింధు, సరిహద్దుసూబా, పంజాబు బెలుచిస్థాను ఒక పాకిస్థానుగాచేరితే చేరవచ్చును- బెంగాలుకూడా అందుచేరగలదా? వేరు పడురాష్ట్రాలు (Contiguous) ఒకే ప్రాంతమందుండవలెనని అన్నారు. అట్లనుచో బెంగాలుఅంతు చేరదు. ఇక పైచెప్పిననాల్గింటిలో బెలుచిస్థానము లెక్కాకుమాలేని యెడారి. పంజాబులో సిక్కులు ప్రాధాన్యముగా ఉన్నారు హిందువులును ఉన్నారు. అయినా యీ యుభయవర్గాలకంటే కొద్దిగా ఎక్కువసంఖ్యలో ముసల్మానులున్నారు. అయితే నూటికి ౪౦ పాళ్ళు పరరాష్ట్రప్రతినిధులు విడిపోవుటకుకోరితే ఆరాష్ట్రము విడిపోవచ్చునన్నారు. పంజాబులో ముసల్మానులు నూటికి ఇంచుమించు ౫౫ వరకున్నందున అందీసమస్య రాజాలదనుకొందుము. సింధురాష్ట్రమున్నూ, సరిహద్దుసూబాయున్ను ఇకమిగిలిన సూబాలు. ఈరెండును చాలచిన్నవి. ఈరెంటిలోను ఆదాయము తక్కువ వ్యయమెక్కువ ఇప్పట్లో తప్పువడివ మొత్తాన్ని కేంద్రప్రభుత్వ మిస్తుంది- ముందువేరైనతర్వాత యెవంత్తును? కేంద్రప్రభుత్వ మియ్యదు. ఇయ్యకుంటే వేరై యేమిలాభము? అది ముస్లింలీగు వారు ఆలోచించుకొనవలసిన ముఖ్యావిషయము. ఈకారణాలచేత పాకిస్థానము చ్చటాంటే బెదరవలసిన పనిలేదు. కాని హిందూసిక్కుసంఘాలవారు ఈసమస్యపైననే క్రిప్సుసూచనలను త్రోసివేసినారు. వీరినికూడా తృప్తిపరచే మార్గమేదైనా ఉంటే కాంగ్రెసునాయకులాలోచించవలెనని మాత్రము ఇప్పట్లో సూచించుచున్నాము.

ఈపాకిస్థానుతోపాటు మరెన్ని స్థానాలు ఏర్పడుకో అని కొందరికి భయమున్నది. అభయాన్ని జర్మనువారు పోగొట్టినట్లే అనుకొనవలెను. విడివిడిగా ఉండే చిన్నచిన్న రాజ్యాలకు ముందుకాలములో బ్రదికే అధారముకానరాదు- నార్వే, డెన్మార్కు, హాలెండు, బెల్జియం, యుగోస్లావియా, అల్బేనియా, లక్జంబర్గు, రుమేనియా, జెకోస్లొవేకియా-ఇవన్నీ జర్మనువారిచేత ఒలింపబడిన సంగతి అందరికిని తెలియును కావున భావిభారత రాజ్యాంగములో తాము వేరుగా ఉంటాములని చెప్పేధైర్యము కలరాష్ట్రముకానరాదు.

ఇకమూడవలోపము భారత దేశమందుండు ౬౦౦ దేశీయసంస్థానాల సమస్య. ఈసమస్య అన్నింటికంటె క్లిష్టమైనది. దేశీరాజులకును కాంగ్రెసుకున్నూ పొత్తుకుదురదు. మరివారికి బ్రిటిషుప్రభుత్వమువారితో ఎక్కువగా పొత్తుకుదిరినను ఆప్రభుత్వశక్తి (Paramount power) క్రిందవారికి కొంతయిబ్బందికరబడుచున్నది- అందుచేతవారున్నూ అందోళనలో ఉన్నట్లున్నది- క్రిప్సుగారు తెచ్చిన సూచనలలో దేశీసంస్థానాలవారు భావిభారతయూనియనులో ఇష్టముంటే చేరవచ్చును లేకుంటేలేదు అని వారికిన్నీ స్వయంనిర్ణయసూత్రమువర్తింపజేసినారు. చాలావరకు దేశీసంస్థానాలు యూనియనులోచేరవు. అప్పుడు ౬౦౦ పైచిలుకుసంస్థానాలు వేరువేరుగా ఉండిపోవును, వారికి బ్రిటిషువారితో సంబంధముండదు వారిరక్షణార్థము బ్రిటిషుసేనయుండును. వారి యిప్పటిపరిస్థితిలో మార్పురాదు. ఈవిధానములో దేశీసంస్థాన ప్రజల అభిప్రాయాలకు అవకాశములేదు. ఇదొక గడ్డుసమస్య కాగలదు. ఇదెట్లు భావికాలమందు పరిష్కృతమగునో తెలియదు. భారతీయ దేశీయ సంస్థానాల సమస్య ఎంతకాలము తృప్తికరముగా పరిష్కృతముకాదో అంతవరకుస్వరాజ్యములో గొప్పలోటుగానే యుండును.

ఈవిధముగా క్రిప్సుసూచనలలో కొన్నిలోపాలు కనిపించుచున్నవి. కాని ఇవన్ని యెట్లున్నను ఇప్పుడేమాకున్నూ దేశరక్షణశాఖలోను సైన్యముపైనను అధికారముండవలెనని కాంగ్రెసుపట్టుపట్టినారనియు, ఇదివీలులేదని క్రిప్సుగారున్నూ, ఏఉలేకుంటే మాకువమిన్నీ వద్దులేఅని కాంగ్రెసువారున్నూ అంటున్నారని అంచెనా వేయబడుచున్నది. మొత్తముపై కాంగ్రెసువారు తృప్తిపడియుండిన యిదివరకే అమాటవారు చెప్పియుందురు. పూర్తిగా తృప్తిపడకుంటే అదికూడా యిదివరకే చెప్పియుందురు. అందుచేత యీదేశ రక్షణసమస్యపై వారు వివాదపడినారని ఊహించిన తప్పు కాకపోవచ్చును. యుద్ధకాలములో అనుభవముకల ఇంగ్లీషువారే రక్షణకు బాధ్యులైయుండుటసరియగుపద్ధతియే. కాని అందుభారతీయులను వారిప్రతినిధులను భాగస్థులనుగాచేయుట అవసరము కావున దీనిపై సమాధానపడుట భావ్యము. సమాధానము కుదరవచ్చునని సర్ క్రిప్సుగారే సెలవిచ్చినారు.

మొత్తముపై లోపాలులేనిదానసనేది? ఆలోపాలు క్రమముగా తీరిపోవలెను స్వతంత్రతయొక్క మూలవస్తువు (substance) లభించుచున్నది. సర్ క్రిప్సుగారు తమ రేడియో ఉపన్యాసములో చెప్పినట్లుగా గతమును మరచిపోవలెను. భావ్యభివృద్ధిని దృష్టిలోనుంచుకోవలెను. అందరును ఏకమత్యముతో వర్తించుకొనవలెను. పరస్పరవిశ్వాసము కలిగియుండవలెను. అవసరమగు సవరణలకు బ్రిటిషువారును కాంగ్రెసువారును సిద్ధపడవలెను- హిందూస్థానము ఇంగ్లాండు అమెరికా రష్యాదేశాలవలె స్వతంత్రదేశమై ప్రపంచనాగరిక జాతులలో గౌరవస్థానము లభ్యమైయుండుటకై ప్రతిభారతీయుడును ప్రయత్నించవలెను.

---

## "తౌరక్యాంధ్రుడు"

మహబూబునగరముజిల్లా మహాసభ అమరచింత సంస్థానములోని బండ్రపల్లి అనుగ్రామంలో గతవారం జరిగెను. మాకువచ్చినవార్తలు నిజమగుచో అందు రెండువిచిత్రములు కనుపించుచున్నవి

ఒకటి ఆహ్వానసంఘ కార్యదర్శియగు దేవరకదిరె కిష్టప్ప అనువారు ఇంచుమించు ౧౩౦౦ రూపాయలచందా ద్రవ్యమును అపహరించినారనుట.ఇదిసత్యమగుచో దీనికిబాధ్యులెవరు' ప్రజాహిత సంస్థలను నడుపుపెద్దలగుఆంధ్రమహాసభా నాయకులు జవాబిత్తురుగాక.

రెండవది అధ్యక్షులగు శ్రీయుత మందుముల రామచంద్రరావుగారు తమ మాతృభాషనుగురించి చెప్పిన ముచ్చటవారిట్లనిరని మావిలేఖకుడు తెలిపినాడు.

> " నేను ఆంధ్రముతోసహా ఉర్దూకును ప్రాముఖ్యత నిచ్చుచున్నాను. నా తండ్రిగారు నాకిట్లుబోధించియుండిరి. మీరు ఉర్దూను చదువవలెను. ఆంధ్రముచదివి ఇతరులకు భట్టరీతి పొగడవలసిన పనిలేదు, ఉర్దూచదివి ప్రభుత్వోద్యోగము చేయవలెను. నన్ను ఇతరాంధ్రులు తౌరక్యాంధ్రుడని ఎగతాళిచేసినను ఫర్వాలేదు నాపిల్లలకు నేను ఉర్దూ నేర్పుదును. ఆంధ్రముకన్న ఉర్దూకు నేను ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చుచున్నాను. నా రాష్ట్రీయభాషను అభ్యసించినందులకు నేను గర్వపడుచున్నాను "

స్వవిషయములో ఎట్లు ఆలోచించుకొన్నను ఎట్లు ఆచరించుకొన్నను ఎవరికిన్ని ఆక్షేపణ కించిత్తుకూడాలేదు- ఇతరులకు బోధించితే మాత్రము సంపూర్ణముగా ఆక్షేపణముకలదు-ఎనిమిదవ ఆంధ్రమహాసభలో, చనిపోయిన రాష్ట్రేతరాంధ్రులనుగురించిన విషాదతీర్మానమును పడగొట్టించినది మన బండ్రపల్లి అధ్యక్షులవారేకదా! పైనుదహరింపబడిన వాక్యాలువారివేనా అని ఆశ్చర్యము కలుగుచున్నది.

---

## మల్లీ ఈ రాసీలు

గతసంవత్సరము గుల్బర్గా, మహబూబునగరు అత్రాపుబల్దాజిల్లాలలో ఈ రాసీల దుండగాలను గురించి మాపత్రికలోచాలా వార్తలువచ్చెను. అందుపై ప్రభుత్వమువారు ఈరాసీలను రాష్ట్రహద్దులుదాటించినారని తలచితిమి. ఇప్పుడు మరల ఓరుగల్లుజిల్లానుండి వీరిఘోరదౌర్జన్యాలను గురించివినుచున్నాము. ఇతరుల ఆవులను దూడలను బలవంతముగ తెంపుట, ఇతరులను కత్తిచూపి భయపెట్టి పైకమువసూలుచేయుట, ఇతరులచేలలో ఉండినపంటను ధ్వంసముచేయుట ఇవన్ని యేశిక్షాస్మృతిప్రకారంగొప్ప నేరములు. ఇట్టి ఆతతాయినులను పోలీసువారు పట్టుకొని చాలానుచేసి శిక్షయిప్పించు సంగతి వినినాముకాని ఇట్టినీచులవెంట పోలీసు వారుండుట వారియెదుట గ్రామాలవారికి నష్టముకలుగుట అందుపై యేమిన్ని చర్య తీసుకొనకుండుట ఇదంతయుచాలా చిత్రముగా ఉన్నది. ప్రభుత్వమువారు ఇట్టి ఈరాసీలకు ఇంతవరకు శిక్షయిప్పించలేదు. ఈరాసీలు నిజముగా యిట్టికార్యాలుచేసినట్లైన వారివెంటనుండిన పోలీసువారు ఇదంతయుచూచుచు ఊరకుండినవారైన అట్టిపోలీసువారిని మొదలు డిస్మిస్ చేసి వారినికూడా విచారించి వారికి మొదలు శిక్షయియ్యవలెను.

మరి మనపిరికి తెలంగానావాముల చర్యల నేమనవలెను? బెదరించినవారికంతా ముడుపులు చెల్లించుకొనవలెనని ఏశాస్త్రములోఉన్నది, ఏఖానూనులో ఉన్నది. ఇట్టి పిరికితనమును వారెన్నడు వదలుకొందురో ఏమో?

---

### బండ్రపల్లి లోకల్ ఫండు పాఠశాల

బండ్రపల్లి ౨౪-౩-౧౯౪౨-

ఈగ్రామము అమరచింతసంస్థానములో చేరినది-(క్రిష్ణాకోడ్కురుపోవు రైల్వేకిక్కు దారిలోనున్నది-ఇచ్చటపూర్వము అంజుమన్ పాఠశాలగా నున్నది-లోకల్ ఫండు పాఠశాలగా ఏర్పాటుచేసినారు-ఈపాఠశాలలో ఉపాధ్యాయుడు మహమ్మదీయుడు ఇచ్చట మహమ్మదీయ బాలబాలికలు తక్కువ-ఈపాఠశాలలో పాఠములు ఉర్దూ భాషలో పెట్టబడియున్నవి-దీనికి ప్రత్యేకస్థలము ఏర్పాటుచేయబడలేదు- ఈ పాఠశాలకు విద్యాశాఖవారైన ఉపకరించే నాతిరు రుణకుపుంస్థానపు కాంట్రాక్టు కలిగిన జేసీ కాలమునకు ఈ శాఖకుఈపాఠశాలకై దేవాలయమునకు ప్రత్యేకస్థలము ఏర్పాటు చేసియుండలేదు- సంస్థానమువారుదీనిపైశ్రద్ధవహించి ప్రత్యేకపాఠశాలఏర్పాటుచేతురుగాక.

---

